

# గ్రామ సమాచారములు

## హాలిన్సుగారి ఉర్దూ ఉపన్యాసము

నల్లగొండజిల్లాలో కొత్వాలీ సదరునాజం

౧౯ న తేదీ రోజు మిస్టర్ యస్. ఇ. హాలిన్సు (సదరునాజం కొత్వాలీ) నల్లగొండకేగి యుండిరి. గార్డు ఆఫు ఆనర్ సలామి తర్వాత పోలీసువారి పేరేడు ను జూచి సంతోషించి, పోలీసు ఉద్యోగులను సంబోధించుచు ఉర్దూలో ఉపన్యసించెను.

“పోలీసువారు, ప్రభువుగారి సేవ తర్వాత ప్రజలసేవ కేవశ్యమని ఎంచవలయును. ప్రజలఎడ అత్యాచారము, దారుణకృత్యములు మానవలయును. అధర్మముగా పైస గడించుట కూడదు. ప్రతి పోలీసు ఉద్యోగి విద్యుక్తధర్మముల నయితప్పక పాలించుచు భీతిని, అధైర్యమును దగ్గరకు రానీయగూడదు. నాదగ్గర సిఫార్సులు పనికిరావు. పనిచేసినవారికి ఫలము తప్పక దొరకును.”

తర్వాత పోలీసుక్వార్టర్సు. ఆశ్వశాల “జూబిలీ గార్డన్” పేర నిర్మింపబడుచున్న తోటనుజూచి సంతోషమును తెల్పుచు స్వతః దస్తురు తనఖీ చేసెను.

## జీవరక్షా ప్రచారము

అఖిల హైదరాబాదు జీవరక్షా ప్రచారక మండలివారు జీవరక్షా ప్రచారమై రాయచూరు, మహబూబునగరము జిల్లాలకు పోయి యుండిరి. నవంబరు ౧౦ తేది బాలేపల్లిలో మర్యాద ప్రతాపరెడ్డి కంపౌండులోను, ౧౨ వ తేది యాపర్లలో గ్రామచావిడీకడను, ౧౪ వ తేది మందా మునగాలలో ధర్మశాల ముంగిటను, ౧౫ వ తేదిని క్యాతూరులో సురవరం రంగారెడ్డిగారింటిముంగిటను, ౧౬ వ తేది ఉండవెల్లిలో గ్రామచావిడీముందరను, ౧౭ వ తేది యటిక్యాలపాడులో దేవాలయమునద్దను ౧౯ వ తేది జల్లాపురములోను, ౨౦ వ తేది బెక్కంలోను సభలుజరిపి జీవదయ సాత్త్విక పూజ మాంసాహారవర్జనము, మద్యనిషేధము మున్నగు విషయములనుగూర్చి ఉపన్యసించిరి. చూడవచ్చినజనము వివిధ స్థలములలో ౪౦౦ నుండి ౨౦౦౦ వరకుండిరి. యక్షిణి దీపసహాయముతో చిత్రపటములజూపియు భజనలు గావించియు ప్రచారములు చేయబడెను. ౨౧ వ తేది కొల్లాపురములో ప్రచారకులకు మనుపటిరోజు పెంట్లవెల్లిలో పెద్దదేవర పూజయని తెలియగా నచటికిపోయి అక్కడ దీర్ఘప్రచారము చేసిరి. సాత్త్వికపూజ సేయుడని హెచ్చరించిరి. సుమారు ౧౫౦౦ మంది వినిరి.

## హనుమకొండ విశేషములు

(స్వ. వి.)

### గ్రంథాలయము

కాలేజి వర్ధంతిలోఁ బ్రదర్శింపఁబడిన చంద్రరేఖయను నాటకము హృదయాకర్షకముగ నుండుటచే దానిని గ్రంథాలయమునకు సహాయార్థము ప్రదర్శింపవలయునని స్థానికమగు ఆమెచ్యూరు నాటకసమాజమువారు ప్రయత్నించుచున్నారు. డిసెంబరు తుదివారములో ప్రదర్శనము జరుగవచ్చును. ఇదివరకు విచిత్రవివాహము అను నాటకమువలన గ్రంథాలయమునకు రు ౧౪౦ లు ఆదాయము వచ్చినది.

నాటకప్రదర్శనమునకు లైబ్రరి కార్యదర్శులగు నేతి సుబ్రహ్మణ్యముగారు మిగుల నుత్సాహముతోఁ బాటుపడుచున్నారు. క్రమశిక్షతో నాటకప్రదర్శనమునకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి. శేషాద్రిరమణకవులు రచించిన అముద్రితములగు విచిత్రవివాహము, చంద్రరేఖయు మట్టెవాడలోఁ బ్రదర్శింపఁబడనున్నవి.

నాటక ప్రదర్శనములవలన వచ్చుఆదాయములో గ్రంథాలయమునకు నూతన గ్రంథములు కొనుట, ప్రాకారము నిర్మించుటలో నగు అవసరకార్యములు నెఱవేరగలవు. ఈవిషయమున స్థానిక న్యాయవాదులును డాక్టరు రామమోహనరావు గారును మిగుల నుత్సాహము జూపుచున్నారు. గ్రంథాలయమునకై ప్రదర్శనముల జరుపు నాటక సాంఘికులకుఁ బురవాసులు కృతజ్ఞులు.

## మౌలానా హాఫీజు జాలంధరిగారు

హనుమకొండలో జరుగుచుండా టోర్నమెంటులకు అనుబంధముగా నేర్పడిన కవితా సభకు ప్రత్యేకాహ్వానముపై ఉరుదూ కవులలో ముఖ్యులగు మౌలానా హాఫీజుజాలంధరి గారు విచ్చేసిరి. డై ౧౯ వ తేది వీరి కవితాప్రదర్శనమునకు సభ జరుపబడెను. అందు జాలంధరిగారు మధురమగు కంఠస్వరముతోఁ దామురచించిన గీతములను కొన్నింటిని వినిపించిరి.

తొలుత కాలేజి ప్రిన్సిపాలుగారు కవిగారికి కాలేజిపక్షమున నెదుర్కొని స్వాగతమునొసంగి కంఠమునందు బుష్పమాలిక నలంకరించిరి. నాటిసమావేశమునకు నగరములోని అధికారులు, పౌరులు, న్యాయవాదులు ఉద్యోగులు పలువురు విచ్చేసిరి. మౌల్వీ యాకూబ్ రహిమాన్ సాహెబుగారు జాలంధరిగారి కవితారచనమునుగూర్చి మనోజ్ఞగీతమును బాడిరి. కళాశాల విద్యార్థిసంఘమునుండి జాలంధరిగారికి నొకగొప్పకానుక ధనరూపముగ నొసంగబడెను

ఏకపత్నీత్వము, కృష్ణుని మురళి, యిఖుబాల్ ఠాగూరుకవుల కవితాప్రశంస, ఖైబరు కనుమలు, చంద్రమండల యాత్రికుని భావములు, మున్నగు గేయములను జదివిరి. కవిత సులభపదములతో నున్నత భావములతో నానందకరముగనుండెను. ఆరాత్రియె వారిప్రయాణముంటచే సభ రాత్రి ౧౧ గంటలకే ఆపబడెను. కాలేజిలో జాలంధరిగారికిని వారి మిత్రులకును నొకవిందు జరుపబడెను.

## ఆహారములో గాంధి ఆదర్శము

ఆహారపదార్థములు తక్కువయైన యిటలీగతి

జాతిసమితిలో సభ్యులగు వివిధదేశములు యిటలీకి తమతమ దేశములనుండి యుద్ధకాలమును దీర్ఘముచేయు సొమగుమతులను అరికట్టుటచే, ఆహార పదార్థముల లోపమేర్పడినందున దీనికేమియు భయపడనక్కరలేదని ఒక యిటలీపత్రిక యిట్లు యిటాలీయులను హెచ్చరించుచున్నది: "పండ్లు మేకపాల ఆహారములో గాంధిమహాత్ముడు బ్రిటిషు సామ్రాజ్యము యొక్క మూలమునే ఊగించగలిగినయెడల,యితాహారముతో యేమి సాధించగలము? యిటాలీయులు భీతిజెంద నవసరము లేదు."

## ఇరాను ఇండియాతో వాణిజ్య సౌకర్యములు గోరుట

ఇరాను (పర్షియా) నుండి కొందరు ఆచటి ప్రభుత్వప్రతినిధులు యూనవంబరు నెల రెండవవారము లో యిండియాకువచ్చి ౨౧ వ తేదిన ఢిల్లీకి చేరియుండిరి. వారచటికి వచ్చినపని ౨౬ వ తేది ముగిసెనట. అచటినుండి వారు సిమ్లాకుపోయి మరల తిరిగివచ్చి కలకత్తా, బొంబాయి, కరాచీలమీదుగా తమదేశము చేరుకొనదలచినారు. వారు యెందుకువచ్చిరది చెప్పకున్నను, చూడగా యిండియాతోను యిరాను నకును, వర్తకసౌకర్యముల కల్పించుకొనుటకై వచ్చినట్లును, నోకుండు—మిరమెమెరములున్నపైలు వేయువిషయమై ఆలోచించినట్లును, తెలియుచున్నది. కాని యిండియాలో ఇరాను పక్షమున రాజకీయ రాయబారియగు వధికారి యెవడును నియమించబడి యుండనందున ఈ ఆలోచనలన్నియు ఇంగ్లాండులోగాని ధ్రువపరచబడ వీలులేదు.

—o—

సంతాన నిరోధప్రచారము

త్వరలో తిరువాన్కూరులో అఖిలభారత మహిళామహాసభ జరుగుచున్నదిగదా! దానికి రావలసినదని లండనులో అంతర్జాతీయసంతాన నిరోధకేంద్రమునకు కార్యదర్శినియగు మార్గరెట్ శాన్గరుగారు పిలిపించబడినారు. ఆమె యీ దేశములోని గొప్పగొప్పవారలను కలిసికొని సంతాన నిరోధవిషయమునుగూర్చి వారలఅభిప్రాయములను తెలిసికొనును.





## సవర్ణహిందువులకు జైలు

## హరిజనస్త్రీలను లూటీ చేసిరను నేరము

బొంబాయి రాజధానిలో నాసిక్‌జిల్లా తాలూకా మేజిస్ట్రేటులా సూ అను గ్రామములో హరిజనులను లూటీచేసి,దొంగిలించిన సొత్తును వశపరచుకొనెనను నేరమునకై అక్కడి మంచి పలుకుబడిగల సవర్ణహిందువులిరువురికి శిక్షవిధించెను. వారిలో ఒకడగు నాధాఅనువానికి మూడునెలల ఖైదును. రూ ౧౫ ల జుర్మానాయున్ను, చతుర్భాయిఅను వానికి రూ ౫౦ జుర్మానా, లేక అది చెల్లించలేనిపక్షమున రెండునెలల ఖైదువిధించబడెను. ఆగ్రామములో కొందరు హరిజనస్త్రీలు ఆగ్రామపు బావినుండి యిత్తడిబిందెలతో నీరుతెచ్చుచుండగా, నేరస్థులలో మొదటివాడు హరిజనులకు యిత్తడిబిందెలను వాడుకొనుహక్కు లేదనుచు ఆబిందెలను ఊడగుంజుకొని అది తనసొత్తుకాదని తెలిసియుండియు తనయింట నుంచుకొనెనని ప్రాసిక్యూషనుకథ.

## సవర్ణహిందువులు లొంగుట

బొంబాయి రాజధానిలో డిస్ట్రోరా తాలూకాలో వాడిపట్టణమందలి హరిజనులు పోయిన ఆగష్టునెలలో యెద్దుబండి యూరేగింపు చేయబోగా అక్కడి సవర్ణహిందువులు ఆటంకపరచియుండిరిగదా! దానిపై హరిజనులు కొందరు సవర్ణహిందువులపై ఫౌజ్దారీ మొకద్దమాలను పెట్టించిరి. ఇప్పుడు అక్కడి సవర్ణహిందువులు దోవకువచ్చుచున్నారు. ఏమన, వారు హరిజనులను క్షమాపణ చెప్పుకొందురట. తమ విజయసంతోషమున హరిజనులు యెద్దులబండి ఉత్సవమును జరుపదలచియున్నారు.

—o—

## హిందూ దేశపు సైన్సు మహాసభ

సైన్సుయొక్క రాబోవుసంవత్సరపు సమావేశము ౧౯౩౬ జనవరి ౨ వ తేదినుండి జరుగును. ఈ సభయొక్క కార్యకారిణి సంఘము ఆసమావేశమున చేర్పాట్లు గావించుటకై తొమ్మిది ఉపసంఘముల నేర్పరచినది. అవన్నియు చురుకుగాపనిచేయుచున్నవి, స్వాగతకేంద్రసంఘమునకు నివేదికలను సమర్పింపగలవు. ఒక ఉపసంఘము ప్రారంభోత్సవము, వాలంటీర్లను సంఘటించి యేర్పాట్లను గావించును, ఇంకొకటి ఉపన్యాసములు, సైన్సులనబడు వివిధ శాస్త్రములను సంబంధించిన సంగతులు జనసామాన్యమునకు ప్రబోధించు ఉపన్యాసములు —వీటినిగూర్చియు; మరియొకటి బండ్లు మున్నగు యానములు, మైక్రోఫోనులు [చెప్పినమాటను దూరములకు పెద్దదిగ వినింపజేయు యంత్రములు] యిదియాదిగాగలవాటిని— వీటినిగూర్చియు! నాట్యకదృశ్యములనుగూర్చియు; అయిదవది విందులు ఎట్‌హోములు, పాటకచేరీలనుగూర్చియు! ౬ వది సైన్సు బుక్కునుగూర్చి ౭ వది ప్రదర్శనమునుగూర్చియు; ౮ వది యకౌన్సుల కనసుగూర్చియు; ౯ వది ధనమునుగూర్చియు శ్రద్ధవహించును. ఇందూరు సంస్థానమహారాజాగారి పోషకత్వమున మహాసభజరుగును.

## పులి తెలుగుబిడ్డతో నొప్పి జెందిపోవుట

ఘూరియాలో ఒకడు కట్టెలు కొట్టుచుండగా పులి వెనుకనుండి అతనిమెడపై దూకెను, అతని తలపుమాత్రము గాంభీర్యముతో చోటుగరచుకొని మెటుపోయెనో పోయెను.

గుల్బర్గాకు దౌరాపై వేగిన, నవాబు మెహదియార్జంగుగారు, హైద్రాబాదుకు తిరిగి వచ్చిరి —విద్యాశాఖనాజముకు ఫజలురహమ్మదుఖానుగారు, గుల్బర్గాకు దౌరాపై నేగి, హైద్రాబాదుకు తిరిగివచ్చిరి.

## సూర్యుని ఏడుగుఱ్ఱములనగ నేమి?

సూర్యోపాసనలో గల సైన్సురహస్యము

హిందువుల గాథలలో సూర్యుడు ప్రతిదినము ౭ గుఱ్ఱములు లాగుచున్న రథములో భూమినంతయు చుట్టివచ్చుచున్నట్లు చెప్పబడినది. ఈ విశ్వాసముయొక్క మూలమేమి? డాక్టరు ఏ. యం. మెహతా (చీఫ్ మెడికల్ ఆఫీసర్ నవనగర్) గారు "సైన్సు అండ్ హెల్తు" అను పత్రికలో యిట్లు ఆ అర్థమును వివరించుచున్నారు.

"ఇండియాలో సూర్యుని వేదకాలమునుండి పూజించుచున్నారు. యజుర్వేదములో సూర్యుడు స్థావర జంగములన్నిటికి ఆత్మస్వరూపుడని చెప్పబడినాడు. మన గాథలలో సూర్యుడు ఒంటిచక్రపు రథములో తూర్పునుండి ఆకాశమార్గమున ప్రయాణము చేయుచున్నట్లు చెప్పుదురు. ఆరథమునకు ౭ గుఱ్ఱములు గలవనియు, చక్రము మాత్రము ఒక్కటేననియు, ఆ రథము నడుపు సూతునికి కాళ్లులేవనియు, పగ్గములు సర్పములనియు చెప్పుదురు.

"కొంచెము యోచనతో యీవర్ణనలో యిమిడియున్న సైన్సు పరమైన మహార్థమును వివరించగలము. మనకు కనపడు సూర్యబింబములో యేడువర్ణముల కిరణము లేనిగలవో వానినే ఏడుగుఱ్ఱములనినారు.

"పగ్గములను సర్పములనుటచే సూర్యతేజఃప్రసారము అలలవలె నుండుననియు, అందువలననే పాదవులు భిన్నములుగ నుండుననియు అర్థము. కాని అవిఅన్నియు ఒకటే వేగముతో ప్రసరించుచుండును. గుఱ్ఱములు ఒకకొకదానికి కట్టబడియుండుటచే. చిన్నగంతులు వేయునవైనను, పెద్దగంతులు వేయునవైనను ఒకటేవేగముతో నడువవలసి యుండును. గంతుల పొడవు యెంతయెక్కువగ నుండునో, కొంత పరిమాణముగల దూరములో వాటిసంఖ్య అంతతక్కువగనుండును. ఒంటిచక్రమనుటచే కిరణప్రసారవేగము యెంతగొప్పదో ఊహించుకొనవచ్చును. అనేక మార్గములనుటచే కిరణప్రసారములకు మార్గములేదని తెలియనగును."

ఇక సూర్యనమస్కారార్థము

"హిందూదేశమున పూర్వము సూర్యరశ్మిచే రోగములకెట్లు చికిత్స చేయుచుండిరో నాకు సమ్మకముగ తెలియదు. అయినను శాస్త్రములలో చెప్పబడిన కొన్ని పూజా విధానములకు సూర్యరశ్మిచే రోగముల పోగొట్టుటయే మైయుండవచ్చును. సూర్యుని పూజచేయుటకు మగనివలెతర్వాత సూర్యుని కెదురుగా చిన్నగుడ్డమాత్రమే ధరించి నిలిచి చేతులెత్తి నమస్కరించుచు ప్రార్థించవలెనని విధానము చెప్పబడినది. చేతులు సాచించుటచే తలకు నీడ కలుగును. పిమ్మట వరుసగా ప్రదక్షిణము చేయుచు ఒక్కొకసారి ఒక్కొక్క పార్శ్వమునకు సూర్యరశ్మిసోక నిచ్చుచు రావలెను. ఈప్రకారముగా అనేక ఆరోగ్యకర విధానములు మతమునుపాటున చెప్పబడినవి. సంస్కృత గ్రంధములలో సూర్యరశ్మిచే కుష్ఠుమున్నగు చర్మవ్యాధులను కుదిర్చినటు గలదు."

## మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యా పీఠము క్రికెటు పోటి

నాగపూరు, అంతర్విశ్వవిద్యాలయ క్రికెటు పోటీలో, ఉస్మానియాజాగు ఓడిరిగదా! ఇక నిజాంకళాశాల విద్యార్థులు, ముస్లిం మద్రాసు విశ్వవిద్యాలయముచే ఎన్నుకొనబడిరి. వారు మద్రాసుపట్నమున, ఆంధ్రవిశ్వవిద్యాలయముతో క్రికెటు పోటి చేయుచున్నారు మిస్టర్. ఎఖ్బాలుబంధు, మిస్టర్, ఎస్.ఆర్ మెహతా గారలు, అద్భుతముగా బౌలింగు చేయుచున్నారు. టూర్నమెంటులో వీరినిమించిన బౌలరులు కానరాలేదు.

ఆంధ్రులకు
౨౦ లక్షల నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధికి ముఖ్యసాధనము? గోలకొండ పత్రికా పోషణము.

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN
The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizams Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రమునందలి జిల్లాలలోని ఆంధ్రులలో వ్యాపారాభివృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము.

Vol. 10. | Monday 2—12—1935 | No. 56

## గాంధిమహాత్ముని విందు

### అణాన్నరకు కడుపు నిండ తిండి

### చింతపులుసు పై పరిశోధన

గ్రామములలో పనిచేయువారికి కొందరికి మహాత్ముడు అక్టోబరు ౨౨ వ తేదివాడు విందుచేసెను. ఆసందర్భమున అవిందుకుపట్టిన ఖర్చును గూర్చి ఉపన్యసించుచు, మహాత్ముడీ క్రింది విధముగ నుపన్యసించెను.

ఈరోజు వంటపదార్థములను నేమందుగా జాగరూకతతో నాలోచించి, ముఖ్యముగా గ్రామములలో పనిచేయువారల అవసరములకు తగినటువంటివాటినే ఉపయోగించియున్నాను. కాబట్టి నేనువాటినిగూర్చి సవిస్తరము చెప్పదలచితిని. పుష్టికరమైనట్టియు, అయినను గ్రామజనుల ఆదాయమునకు సరిపోవునట్టియు, ౮ గంటలపనికి అధమపక్షము మూడణాలైనను యివ్వవలెనని మేమునిర్ణయించియుండిన కూలికి సరిపోవునట్టియు భోజనమును మీకుపెట్టవలెనని ప్రయత్నించితిమి.

ఈరోజు మనము ౧౬ మంది భోజనము చేయుచున్నాము. మనభోజనమునకు మొత్తము మీద రూ ౯–౧౪–౩ లు ఖర్చుఅయినది. అనగా ఒకపూట భోజనమునకు ౬ పాయీలకంటె కొంచెమెక్కువ పట్టినదన్నమాట. క్రింద ఖర్చులోని అంశములను విస్తరముగా చెప్పుచున్నాను.

| | | | రూ – అ – పై |
|---|---|---|---|
| ౩౬ | తోండ్ల | గోధుమపిండి | ౧ – ౭ – ౦ |
| ౧౨ | ,, | టమాటోలు | ౦ – ౧౧ – ౩ |
| ౪ | ,, | బెల్లము | ౦ – ౬ – ౩ |
| ౨౪ | ,, | గుమ్మడికాయ | ౦ – ౯ – ౬ |
| ౬ | ,, | అవిసెనూనె | ౧ – ౨ – ౦ |
| ౨౫ | ,, | పాలు | ౩ – ౧౩ – ౦ |
| ౪ | ,, | సోయాబీను | ౦ – ౬ – ౦ |
| ౪ | | కొబ్బరికాయలు | ౦ – ౪ – ౦ |
| ౧౬ | | కాఫ్ పండ్లు | ౦ – ౧ – ౦ |
| | | ఉప్పుచింతపండు | ౦ – ౨ – ౩ |
| | | కట్టెలు | ౧ – ౦ – ౦ |
| | | మొత్తము | ౯–౧౪–౩ |

నేను మీకందరికిని రొట్టెయిచ్చుట యవసరము లేదనియు, [మేమిక్కడ ప్రతిదినము ఉపయోగించు] గోధుమజావ చేసియిచ్చినచాలునియు, అవిసెమగ యెంతో కష్టము తగ్గుననియు చెప్పినారు. కాని ఆసూచన నాకు నచ్చలేదు. మీరుయువకులు. భగవంతుడుమీకు గట్టిపండ్ల నిచ్చినందుకు మీరు గట్టిరొట్టె తినవలెను. అది యెవ్వరైనను చేసికొనగలరు. దానిని యెకరుగాని తానెక్కడికి పోవుచున్నను సులభముగా కూడ తీసికొనిపోవచ్చును. అదెరెండురోజులవరకు చెడకుండుట యింకొకలాభము. పండి పిసుకకముందు దానికి అవిసెనూనె పట్టించి పిసికినాము. అందువలన పిండిమెత్తగాను, పెళుసుగాను తేలెను. తర్వాత కొంచె ఆపపదార్థము. కూరగాయలును ఉండవలెను కాబట్టి టమాటోలను, రెండుపచ్చళ్ళను చేయించితిమి. ఇక్కడ, కాఫ్, పండ్లు యెక్కువగా దొరకును. అందువలన మేము అపండ్లతో ఒకపచ్చడి చేయించితిమి. తర్వాత మాతోటలో దొరకు ఆకులతో యింకొక పచ్చడిచేయించితిమి. ఈ కాఫ్ పండు మంచివిరేచనకారియేగాక మలముతో పడు చీమును కట్టునని ప్రసిద్ధిజెందినది. దీనిలో బెల్లము కలిపిన ఏ మంచిరుచిగల పచ్చడితయారగును.

చింతపులుసు విలువ

ఇంకొక పచ్చడిలో కొంచెము కొబ్బరి, చింతపండు, ఉప్పు ఆయాకులతోకూడ కలిపినాను. పచ్చిఆకులను మనము రోజూదో యొకరూపముగా తినవలెను. వాటినుండి విటమినులు యెక్కువగా లభించును. అన్నిటికంటె చాలచోక పచ్చడిలో చింతపండు వేసినది మీరుచూచినారుకదా! సాధారణముగా చింతపండును యేమోహీనము జూచెదరు. కాని పరిశీలించగా అది మంచి విరేచనకారియనియు, రక్తశుద్ధికారియనియు తేలినది. నేను యీఆశ్రమములో నుండు ఒకనికి మలేరియాతో బాధపడుచుండి ప్పుడు చూచారు, దండిగా నిచ్చితిని, మంచిగుణము కనబడెను. అట్లే మలబద్దకము గలవారలకును ఆ నేకులకు యిచ్చిచూచితిని.

చింతపులుసు పరిశోధక మహాత్ముడు

### నేయి లేదు

భోజనములో పాలు చాలముఖ్యమైనది. మీకుఅర్థపౌండు పాలువాడితిని. నేయిమాత్రము మీకువేసియుండలేదు. అయినను అది లేకపోయెనని మీరు కొరవపడియుండిరని నేననుకొనెదను. ఎందుకనగా దానికి బదులు సోయాబీనులు, చమురువాడినాను. సోయాబీనులలో చమురుయెక్కువ (నూటికి ౨౦ పాళ్ళు), ప్రోటీను పదార్థము (నూటికి ౪౦ పాళ్ళు) వేరుసెనగలోకూడ చమురుయెక్కువ, కాని వాటిలో ఒకలోపమేమన పిండిపదార్థ మెక్కువ. అది సోయాబీన్లలో వేరుసెనగలోకంటె చాలతక్కువ సోయాబీన్లతో పాలనుకూడ ఉపయోగించినచో మనకు కావలసిన కొవ్వుపదార్థమంతయు అందు దొరకును. ఇక నేయి అనవసరము. కాబట్టి నేయి చేసికొను కష్టమెందుకు? మంచినేయి దొరకుటయేమో అనిపించునప్పుడు, నమ్మకములేని నేతికై శ్రమయెందుకు?

పాలుకొని. మజ్జిగకాని మనకేదో యొకటి కొద్దిగానైన నుండవలెను. కూరగాయలలోని క్రొవ్వు పదార్థములను, ప్రోటీన్లను కరగునట్లు చేయుటకవి ఉపయోగించునని వైద్యశాస్త్ర ప్రవీణులు చెప్పుదురు. కాబట్టి నేయి వదలినను యేమియు ప్రమాదములేదు. ఇటీవల నేను యిద్దరు శిశువులను పోషించునప్పుడు, వారిద్దరి భోజన విషయములో చాల జాగ్రతతీసికొనుచుంటిని. నేనువారికి నేయివేయుట మానితిని, కాని అంతమాత్రాన వారికేమియునష్టముకలుగలేదు. అయితే నేనువారికి కావలసినన్ని పాలిచ్చినాను.

మన భోజనమిప్పుడు ౬ పాయీల, కంటె కొంచెమెక్కువ ఖరీదు పడినది ఇప్పుడైనను తృప్తికరమైన భోజనము లభించినదిగదా! ఇతర భోజనములు యింత గొప్పవిగా నుండవనిలేదు. కాబట్టి అవి అణాకంటె యెక్కువ ఖర్చుపట్టవలసిన అవసరములేదు. తక్కిన భోజనములకు పాలు వదలవచ్చును. గోధుమ రొట్టె, సోయాబీన్లు, పచ్చడి చాలును.

---

## రాంపూరు సంస్థానమునకు శాసనసభ యేర్పడుట

రాంపూరు సంస్థానమునకు ఈనవంబరు ౨౦ వతేది శాసనసభ యేర్పరచబడినది.

సంస్థానము రోహిల్ ఖండ్ లో నున్నది. ఉత్తరమున, తూర్పునను, దక్షిణమునను, పడమటను వరుసగా బ్రిటిష్ఇండియాలో చేరిన నైనిటాల్ జిల్లాయు, బారిల్లీయు, బుడాయూనున్ను, మురాదాబాదున్ను దీనికి యెల్లలు. ఈ సంస్థానముయొక్క రాజకీయసంబంధము సంయుక్తరాష్ట్ర ప్రభుత్వముచేత నడుపబడినది.

మొత్తము యీ రాష్ట్రముయొక్క విస్తీర్ణము ౮౯౨.౫౪ మైళ్ళు. జనసంఖ్య ౪౬౫౨౫౭ వారిలో నూటికి ౫౫ మంది వంతున హిందువులును ౪౫ మందివంతున ముసల్మానులును గలరు. ఈసంస్థానముయొక్క నేటి ప్రభువు నవాబ్ సయ్యద్ మహమ్మద్ రజా అలీఖాన్ గారు ౧౫ తోపుల గౌరవముగలరు. సంస్థానాదాయము సాలు ౧కి ౪౯౧౭౨౩ ఖర్చు ౪౭౫౫౯౫౪౯. ౧౯౩౦ సం॥ వరకు అక్కడ ౧౫౦ పాఠశాలలుండెను. న్యాయ పరిపాలన మేగాక, పోలీసుశాఖ, ఆర్థికశాఖ, వైద్యశాఖ యివన్నియు ౧౯౩౦ అబ్బునుండియు క్రొత్తగా సంస్కరించబడియుండెను.

ఇప్పుడా సంస్థానమునకు శాసనసభ యేర్పడినది. మొదటి శాసనసభ ప్రారంభోత్సవమును జరుపుచు నవాబుగారిట్లు చెప్పిరి.

"నేను సింహాసనమెక్కినది మొదలు (౧౯౩౦) ౨౦ జూను ౧౯౩౦, నా సంస్థానములో శాసనబద్ధమైన పరిపాలనా విధానము నేర్పరుచదలచియుంటిని. ౧౯౩౦ లో నేను పూర్తిగా సంస్థానాధికారులుగల ఒక కమిటీని యేర్పరచి, ప్రస్తుత కాలాను గుణములగు శాసనసూత్రములను చక్కగా ఆలోచించి సరిగా మార్చవలసినదని ఆజ్ఞాపించియుంటిని. తర్వాత ఆకమిటీలో మరియిరువురుసభ్యులు రాంపూరు న్యాయవాదుల తరఫున చేర్చబడిరి. ఈశాసనకమిటీ పోయిన అయిదేండ్లలో చాల ముఖ్యమైనపని చేసియుండెను. యిక్కడి శాసనముల వైఖరిని నవీన నాగరికతకు తగినట్లు సంస్కరించినది యీకమిటీయే. నాప్రజల ప్రతినిధులకు తమ సంస్థానమునకు శాసనముల నిర్మించుటలో అభిప్రాయము తెలుపుటకు అవకాశము యీయవలయునని నాకోరిక యైయుండెను. కాబట్టి యిప్పుడు సరిగా యేర్పరచబడిన యీశాసనసభ ఆ కోరిక ఫలితమే. ఈ సభ శాసనములను నిర్మించుటయు చర్చించుటయే గాక, ప్రభుత్వమువారు వారి యెదుటికి తెచ్చువిషయములపై అభిప్రాయములనుకూడ యిచ్చును."

నవాబ్ గారు పోయినతర్వాత వారియెడ కృతజ్ఞత తీర్మానము చేయబడెను. అప్పుడే ప్రభుత్వసభ్యులు రెండు శాసనములను విచారణకు తెచ్చిరి. ఆరెండును సెలెక్టు కమిటీకి పంపబడినతర్వాత సమావేశము ముగిసెను.

---

## ప్రభుత్వ విమానములకై ఇంగ్లాండుకు ఆర్డరు

నిజాం ప్రభుత్వమువారు హాకిలేండు అండుకంపెని (ఇంగ్లాండు) వారికి రెండు విమానములు సిద్ధపరుప ఆర్డరిచ్చియున్నారు. ఈవిమానములువిద్య గరపుటకై కొనబడుచున్నవి. డిసెంబరునెలలోనే రాగలవు. ప్రభుత్వవిమానపుశాఖ ఇన్స్ట్రక్టరగు, మిస్టరు ఏ. డబ్ల్యు. షెటూగారుగూడ, డిసెంబరు నెలలో రానున్నారు

---

Printed and Published by G. Ramakrshna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy